# ఉపాధ్యాయుఁడు

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు
బి. ఏ., యల్. టి.




పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ప్రకాశకుల కృతజ్ఞత

విఖ్యాతకథానికారచయిత శ్రీ, మునిమాణిక్యం నరసింహారావుగారు, తాము రచించియున్న 1. నేనూ మా కాంతం, 2. కాంతంకైఫీయతు. 3. మునిమాణిక్యం కథలు, 4. మునిమాణిక్యం నాటికలు, 5. కాంతం కాపరం, 6. ఉపాధ్యాయుడు, 7. మేరీ కహానీ, 8. తిరుమాళిగ అనే గ్రంథము లెనిమిదిన్నీ, మా ప్రకటనశాఖ యెడల తమకు గల అపరాభిమానములతో, అయిదు సంవత్సరములవరకును మేము మాత్రమే ప్రకటించుకొనే హక్కు మాకు దయచేసియున్నారు. ఇందుకు, వారికి మే మెంతయు కృతజ్ఞులము. అవన్నియు వెన్వెంటనే మేము ప్రకటింపబూనుకొన్నాము.

దొరబాబు అనే పుస్తకములో ఉన్న మూడుకథలు యీపై 1, 5 పుస్తకాలలో చేరిపోయినవి.

మరిన్నీ, ఇదివరకే వారు సర్వాధికారములతోడను మాకు దయచేసియుండిన "కాంతం కథలు" అనే గ్రంథమును, ఇప్పుడిప్పుడే మేము రెండవ కూర్పు ప్రకటించి ఆంధ్రమహాజనులకు నివాళించుకొనియున్నాము.

రాజమండ్రి
1 జనవరి 1944

ప్రొప్రయిటరు
సరస్వతీ పవర్ ప్రెస్

Saraswathi Power Press, Rajahmundry
Printed and Published by
A. Lakshmanaswamy Naidu
For Addepally & Co., Educational Publisher
1st Edition 1946 No. 4191/1946

# విషయసూచిక

# కృతజ్ఞత

ఈకథలు చిన్నప్పుడు మా శివశంకరశాస్త్రిగారు నాలో పెంపొందించిన ఉపజ్ఞకు ఫలితాలు. వారు చూపిన దారిలోనే ఇవి ఇంతవరకూ రాణించి ఆంధ్రుల అభిమానాన్ని పొందినవి.

నాకు దేశంలో కొద్దో గొప్పో పేరుప్రతిష్ఠలు తీసుకొచ్చిందీ, నన్ను కథకుని గా తయారుచేసిందీ, మా శివశంకరశాస్త్రిగారే.

అందుకని నిజంగా నేను పుస్తకం వ్రాసి కృతజ్ఞత చూపాలిసింది మా సాహితీసమితి సభాపతులకే. అప్పుడప్పుడు మిత్రులు బాగున్న విషయాలను మెచ్చుకుంటూ నాలో ఉత్సాహం పురికొల్పినా అవి క్షణికాలు.

నిజంగా చేయూతా, స్థానం, యిచ్చింది మా శాస్త్రిగారే.

మా సాహితీసమితి సభాపతులూ, పండితులూ, దేశభక్తులూ, ఉత్తమకవులూ, నాకు గురుమూర్తులూ అయిన శ్రీశ్రీ శివశంకరశాస్త్రిగారికి నా కృతజ్ఞతను విన్నవించుకొంటున్నాను.

# 1

## "మాస్టరీ" సంపాదన.

ఉపాధ్యాయుని జీవితం అందరు అనుకొన్నట్లు అంత కారయుతమైనది కాదనీ, బ్రతకలేక బడిచదువు చెప్పుకో అనే మాట నిజము కాదనీ, అనుభవించేవాడికి ఈజీవితంకూడా హాస్యరసము ఇస్తుందనీ చెప్పటమే దీనియొక్క ముఖ్యోద్దేశము.

మా ప్రశ్నలకు కుర్రవాళ్లు ఇచ్చే జవాబులు, వాళ్లు చేసే అల్లరులు, రాసే రాతలు మావి ఆనందించవలసినదే కాని చితికించటంమూలాన పాఠకులను రంజింపజేయ ప్రయత్నించుట దుర్ఘటమైనకార్యము. అయినా పూనుకొన్నాను. నేను ఎటువంటి ఉత్సాహపూరితమైన హృదయంతోను, కుతూహలంతోను వ్రాస్తున్నానో, అటువంటి హృదయాలతోనే పాఠకులు దీనిని చదువవలెను. కాని ఉన్నతాదర్శములు, ఉత్కృష్టప్రేమ, గంభీర భావములు, నీతిపాఠములు ఇవి ఉత్తమకావ్య లక్షణాలు అని అనుకొని వాటికోసం యీ వ్యాసంలో చూస్తే ఏమీ కనుపించవు. అటువంటి ఉత్తమవిషయములు మీకు కావలెనంటే ఈ వ్యాసం చదువవద్దు.

కాసేపు మనసార నవ్వుదా మనుకొంటే రండి, మంచో చెడ్డో, నవ్వటం ప్రధానం. చిరునవ్వు నవ్వినాసరే, కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వినాసరే, నాకేదైనా సంతోషమే. అది మీతత్వాన్ని అనుసరించిఉంటుంది ధన్వంతరి సిద్ధాంతప్రకారం

బహుశః పిత్తకోశాన్ని ఆధారంచేసికొని ఉంటుంది. పైత్య తత్వం అయితే కిరకబడి నవ్వుతారు. కొంచెం వాతంకూడా కలసిఉంటే చిరునవ్వు నవ్వుతారు. సంశ్లేష్మం దాటితే వాళ్ళకు ఈ పుస్తకం చదవటానికి అర్హత లేదు. వాళ్ళకు పైత్యం బొత్తుగా నశించి నాడి వాతంమీద హంసనడకలాగ నడుస్తుంది. అట్టివారికి నవ్వురాదు.

ఇంగ్లీషుభాషలో జెరోం, జేకోబు, కెనెన్, హావర్డ్స్, వుడ్‌హౌస్, కార్నిఫోర్డ్, ఎన్‌టుసీ మొదలైన సుప్రసిద్ధ హాసికుల పుస్తకాలతో పరిచయం ఉన్నవాళ్ళకు ఈవ్యాసం కొంచెం రుచిస్తుంది.

ఆదిలో నిర్గృతి, ధనలక్ష్మి అని ఇద్దరు అక్కచెల్లెండ్రు ఉండేవారు. ధనలక్ష్మికుమారులు వర్తకంవ్యాపారము, వాజ్యాలు నడపటం మొదలైన పనులు చేసి ధనవంతులైనారు. నిర్గృతి కుమారులు బడిచదువు చెప్పుకొని బీదలైనారు. బీదలైన ఉపాధ్యాయులు నిర్విశేషజీవనమైన నిర్వృత్తికి నిర్వాణానికి అడ్డులేనిదైన మనుగడ అనుభవిస్తున్నారు.

అట్టి నిష్కలుషమైన జీవనము ఇంత నిస్రావము త్రాగి జీవిస్తే నేమని నిశ్చయించుకొని దానికై అన్వేషణ ప్రారంభించినాను. కావలెను అన్నచోటకల్లా నా కాగితములుపంపినాను. నేను పంపిన విన్నపములు పురాణ విద్యార్థులకు చెప్పిన విద్యలాగ, అగ్నిలో పోసిన ఆజ్యంలాగ నామరూపాలు లేకుండా పోయేవి.

పెద్దవాడ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడు కావలెనని విని ఆ వూరు ప్రయాణం కట్టాను. ధరకాస్తుపంపితే లాభంలేదని స్వయంగా ఆ పాఠశాలాధికారులను చూచుటకు నిశ్చయించుకొన్నాను.

దరఖాస్తు వ్రాసి పెట్టెలోపెట్టుకొని కావలసిన బట్టలు తీసికొని ఇల్లుబయలుదేరి రెండడుగులు వేసేసరికి పిల్లి ఎదురుగా వచ్చింది. దాన్ని నాలుగు తిట్టి, తిరిగి ఇంటికిపోయి, అరుగు మీద కూర్చుని, కాళ్లు కడుక్కొని రెండు బియ్యపుగింజలు నమిలి, మా అమ్మాయినే నాకెదురుగా రమ్మని ముందుపంపాను. ఈతడవ కన్యాముత్తైదువు ఎదురుగా వచ్చిందని సంతోషించి బయలుదేరినాను. కాకి ఒకటి ఎడమవైపునుంచి కుడివైపునకు పారటంవల్ల శుభశకునాలు ద్విగుణంగా వచ్చినవని సంతోషించి రైలెక్కి పెద్దవాడ చేరాను.

ఆయన ఇల్లు పెద్దబజారులో ఉంది. పెద్ద అరుగులఇల్లు. ఆ అధికారి వైశ్యకుల వయోవృద్ధుడు. అందుచే నమస్కరించాను. ఆయన ఆజ్ఞను అనుసరించి ఒక ధూళిధూసరితమైన కుర్చీలో కూర్చున్నాను. మాఇద్దరికీ సంభాషణ ఇల్లా జరిగింది. ఆయన నావంక దేరిపారజూచి.

'మీదే వూరండి ?'

'తిరువూరు.'

'ఎందు కొచ్చారు ?'

'తమ పాఠశాలలో పనిచేయుటానికి ఒక బి. ఎ. కావ

అయునని విని తమను చూడటానికి స్వయంగా వచ్చినాను.'

ఈ మాటల్లో ఏముందోకాని ఆయన చిరునవ్వు నవ్వి ప్రక్కనున్న మరొకనైశ్య ప్రముఖునివంక చూశాడు. చూశావా? ఎంతమంది వస్తున్నారో ఈ ఉద్యోగంకోసం.– అనే అర్థం ఆచూపులోవుంది. మళ్ళీ ఆయన నావంక చూచి,

"తమరు గ్రాడ్యుేట్లేనా"

"మొన్నే బి. ఏ. ప్యాసు అయినానండి."

"అంతే, గ్రాడ్యుేట్లన్న మాటేనా? ఏమైనా శ్రేణం ఉందాఅండి."

"ఏమీ లేదండి నేను గ్రాడ్యుేట్టునే"

"సరే మా కో గ్రాడ్యుేటు కావాలని పెద్దమాష్టరు గారు చెప్పారు. మీ యూరికి ఈవూరు చాలాదూరముకదా. ఇక్కడ ఉంటారా? ఈమధ్య ఒకాయన ఇట్లాగేవుంటానని ఆర్డరు పుచ్చుకొని చెప్పకుండా వెళ్ళిపోయినాడులెండి. దాని తరువాత విచారిస్తే వాళ్ళ ఊరిదగ్గరే ఏదో వుద్యోగం దొరికిందని తెలిసింది."

"మీకు అటువంటి భయం వుండనక్కరలేదు. ఎక్కడుంటే అదే నాకు స్వగ్రామము. పొలమూ బాట్రా లేని వాళ్లకు ఎక్కడ పొట్టగడిస్తే అదే స్వదేశం" అని కొంచెం దీనంగా మాట్లాడినాను.

ఆయనకు నాయందు అభిమానం కలిగినట్లుంది. ఎందుచేతనంటే నన్ను హెడ్ మాష్టరును చూచిరండని అన్నాడు.

ఆ హెడ్‌మాస్టరుగారు నాకు బాల్యంలో గురువు. ఆయన నావిషయంలో ఏవిధమైన అడ్డూ పెట్టక 'రేపు తప్పక వెళ్ళిపోతావు. నేనుకూడా నీకు చేయదగిన సాయము చేస్తా' నన్నాడు మహానుభావుడు. అట్టి సహృదయుడు వందనీయుడు.

మర్నాడు ఆయనను చూడటానికి బయలుదేరాను. తెల్లమల్లు కట్టాను. పాప్లినుచొక్కా, సిల్కుకోటు వేసుకున్నాను. కొంచెము డాబుగా వుండాలని నా ఉద్దేశం.

నన్ను ఒంటిగంటకు రమ్మన్నాడు. నేను సరిగ్గా ఆవేళకు పోయేసరికి ఆయన పనిలో వున్నాడు. ఏమి చేసేది? అక్కడే కుర్చీలో కూర్చున్నా. రెండైంది, మూడైంది, ఆయన రాలేదు. ఎండకాలం కావటం చేత నోరెండిపోతున్నది. బైటికి వెళ్ళి ఒక్క సోడానీళ్ళు తాగివద్దామనుకుంటే, తీరా నేను కాలు బయట పెట్టేసరికి ఆయన వచ్చి, నేను రాలేదనుకొని వెళ్ళిపోతాడేమో అని భయం. అట్లాగే అక్కడ అయిదు గంటల వరకు కూర్చున్నాను. అప్పటికి ఆయన దర్శనం అయినది.

"మీరు వచ్చి ఎంతసేపైందండి ?"

"ఒంటిగంటకే వచ్చానండి"

"మీకా వెళ్ళాను ఆయన కనపడ్డాడా?"

"ఎవరండీ ఆయన ?"

"మీకు తెలియదా ? యమ్. ఏ. ప్యాసు అయినాడట మిమ్ములను ఎరుగట. ఎక్కడో కలిసి చదువుకొన్నారట."

"ఎంగనండి"

"పొడుగుగా, ఒక్క బల్చగా, చామన చాయన వుం
టాడండి. మిమ్మల్ని బాగా ఎరుగునన్నాడు"

"కావచ్చు. నాకే మాత్రము జ్ఞాపకంలేదు. అయితే
ఎందుకొచ్చాడండి ?"

"మీ మాస్తరుగనే ఈవుద్యోగానికే వచ్చాడు.
చాలా ఇబ్బందిగావుంది. జీతం ఏమిఇచ్చినా పుచ్చుకుంటా నండి
అని ఎంతో ప్రాధేయపడ్డాడు. కాని మిమ్మల్నను అడగంది నేను
మాట ఇయ్యనని పంపాను. సాయంత్రం వస్తానన్నాడు. ఇంకా
కాసేపటికి వస్తాడు అనుకొంటా. లేకపోతే బైట కూర్చున్నాడో
ముందు మీరు వచ్చారు. మీరు వద్దంటేనే ఇతనికి ఇయ్యటం"

ఆహా ! ఎంత విశ్వాసపాత్రుడు ఈయన, అని నాకు
సంతోషం కలిగింది. అందుకని అన్నాను —

"అయ్యా, మీరు ధర్మం ఆలోచించారు. నేను
మిక్కిలి అవసరంలోనున్నా. నాకు దయచేసి ఆర్డరు ఇయ్యండి."

"ఇయ్యటానికి అభ్యంతరములేదు. మీకు మాకు
జీతం దగ్గరే కుదరాలె."

"ఎం తంటారు?."

"మీకు ముందుగానే మనవిచేస్తున్నా. మాస్కూ
లులో జీతాలు తక్కువ. అయినా తొమ్మిదినెలలకే ఇస్తాము.
మీయిష్టమైతేనే రండి, లేపోతే వెళ్లండి. క్రిందటిసంవత్సరం
వెళ్లిపోయిన గ్రాడ్యేటుకు 28 ఇచ్చేవాళ్లం. ఆయనచాలా అను

భవం కలవాడు. నమ్మతాయి! నామాటయందు నమ్మకం
లేకపోతే సుబ్బారావుగారిని కనుక్కోండి. ఆయనకు బంధువుడే
అయన. ఈనెల్లూరు ఆయన ముప్పై ఇయ్యమంటున్నాడు.
మీకు అనుభవమూలేదు. M. A. అయినాకాదు. ఏమియ్య
మంటారు?"

ప్రభూ! బి. ఏ. కు ఎంత విలువ వుందో నాకు బోధ
పడ్డది. ప్రాణాలు చల్లబడ్డది. గుండె పగులుకుపోయింది. నోట
మాట రాలేదు. నేను అంత తక్కువకు ఒప్పుకోకపోతే M. A
సిద్ధంగా వున్నాడు ఇంకో నోట ఇంతకంటె ఎక్కువవస్తుందని
నమ్మకం ఎక్కడ? అని ఆలోచిస్తూ వుండంగానే, ఎవరో కుర్ర
వాడు వచ్చి నెల్లూరు ఆయన వచ్చాడు అని చెప్పాడు ఇంకే
ముంది ఈవుద్యోగం వాడు లటిక్కిన వేసుకెళ్లటానికి సిద్ధంగా
వున్నాడు. అధికారి నావంక చూచి నవ్వాడు, "ఏమంటావు
పోతున్నది బేరం. నీయిష్టం" అన్నట్టు. నేనూ ఆయనవంక
దీనంగా చూస్తూ "నలభై అయినా యిప్పించండి" అన్నాను.
ఆయన ఒక చిరునవ్వునవ్వి "అబ్బో! ఎంత అడిగావు! మాకు
అందికలో లేదే! ఇక లాభంలేదు! బేరం కుదరదు" అని
మాటలు తర్జుమాలో అర్థంవచ్చేచూపులు చూశాడు.

నేను 'ఇక లాభంలేదు. పరుగెత్తి పాలు త్రాగేకంటె
నుంచుని నీళ్లు త్రాగటం మేలు' అని అనుకొని, సరే ముప్పై
అయిదయినా నాకు ఇప్పించండి అని అన్నాను.

"ముప్పైఇస్తే ఆయనే వస్తాడు. నామాట అబద్ధం

అయితే ఆయనను పిలిచి మీయెదటనే మాట్లాడించమంటా రా?" అన్నాడు. "ఎబ్బే మీమాటయందు నమ్మకం లేక కాదు. దయచేసి నే సడిగింది ఇయ్యండి"

"అకంతా పట్టిమాట. భాగ్యానికి వలెనే 28 ఇస్తాను. మీ ఇష్టమైతే చెప్పండి. ఇక పై ఏమైనా కిస్తే అంటే ఇప్పుడే ఆర్డరు ఇస్తాను."

ఏమిచేసేది "సరే మీ ఇష్టం అయినా ఇయ్యండి" అన్నాను. ఆయన చిరునవ్వు నవ్వి "మా అదృష్టవంతులు పెద్దమాస్టరు గారు కూడా మీ సిఫారసు చేశారు. మీరు అభిమానంగా పనిచేస్తారనే నమ్మకంతో మీకు ఆర్డరు ఇస్తున్నాను" అని "ఒరేయి, వీరాస్వామి కేసను తీసి తెచ్చి ఆర్డరు పైని కొట్టమను గుమాస్తాతో. ఆ జీతం రాని మనసుతో కేసు నమ్మని చెప్పు" అని అన్నాడు.

"ఆర్డరు వస్తుంది తీసుకపొండి. మీకు మాస్కూలు పాత విద్యార్థులుకూడాను. విశ్వాసంగా పనిచేయాలి అయితే నాకోసందేహంవుంది. అడుగుతాను కోపంలేదుగదా" అన్నాడు ఆయన. "నేను చిన్నవాడిని తమరు పెద్దలు. మీమీద నాకు కోప మేమిటి? దయచేసి చెప్పండి మీసందేహ మేమిటో" అన్నాను.

"ఏమిలేదండీ, మాస్కూలులో కొంచెం అల్లరికుర్రవాళ్ళు వున్నారు. చూడబోతే మీదగ్గర నదురు తక్కువ. చెప్పగల ధైర్యం వుందా?" అని అన్నాడు ఆయన. మల్లుబట్ట

పాస్టినుచొక్కా సిల్కుకోటు వేసికొన్నా సదరు తక్కువ
గానోలు ఆయనకళ్లల్లో. అయినా నీళ్ళునమలితే లాభం
లేదని "అయ్యా ఒక్కమాట చెబుతానువినండి. సదరు మటుకు
తక్కువే కాని చెప్పటం సిసలుగా వుంటుం" దని అన్నా.
వక్తృకశిఖామణి హృదయానికి ఈమాటలు టంకంపొడిలాగ
అతికినవి. వృత్తరక్షణంలో అద్దరు తెచ్చి నాచేతికిచ్చి చిరు
నవ్వుతో అశ్రువు తుడిచికుంటూ, అన్నాడు.

అప్పుడు నాకు ఆయనను మాస్త్రే కలిగినపోత నాకొకసారి
మద్రాసులో మూర్ మార్కెట్టులో ఒకషాపువానికి పుట్టిన
పస్యాభావంతో తులతూగుతుంది. నేనూ మరియొక పెద్ద
మనిషి ఆమార్కెటుకు పోయి కొన్నివస్తువులు బేరంచేశాము.
ఎన్నో చిన్న వస్తువులు కొన్నాము. తరువాత ఒకపెద్ద
పాంపుకాగితాలు బేరము చేశాము అది మాపులకు చాలా
డాబుగావుంది పైకి పాలిష్ హంపా రుసులంగా వుందికాని
దానిఖరీదు అంతవుండదని మాకు తెలుసు కాని ఎంతో
నిశ్చయించి చెప్పలేము. అతను పదిరూపాయలు చెప్పాడు.
చివరకు మూడున్నరకు పైసలుచేసి కొన్నాను. ఈవ్యవహార
మంతా దీక్షతో గమనిస్తున్న పక్కషాపువాడు మేము
పోతుంటే మావంక నవ్వుతూ చూచి You are lucky
అన్నాడు.

అసలు ఆకలం అర్ధరూపాయి ఖరీదు. అందుకని మమ్ము
లను వేళాకోళానికి వాడు అల్లా అన్నాడప్పు దానితరువాత

తెలిసింది.

ఈస్కూలు అధికారి అంటే. నెల్లూరు ఆయన కేవలము కల్పిత పురుషుడు. అట్లా ఒక యస్. ఏ. ను సృష్టించి జీతాలు తగ్గించటం ఆ కాలపు సహజమైన వ్యాపారమని తరువాత నాకు స్నేహితులు చెప్పినారు. ఎట్లాగనయితేనేమి ఆస్కూలులో ఉద్యోగం దొరికింది.

## 2

### ఉరుములు - మెరుపులు.

నేను ఉపాధ్యాయుడుగా పాఠశాలకు వెళ్లిన మొదటి రోజు నా సమస్తజీవనంలో పండుగదినము- అంతవరకును స్వేచ్ఛగా తిరిగినాను. నా విద్యార్థిజీవనం నిష్కంటకమైనది. నేను గడపిన మనుగడ నిష్కళంకమైనది. నాజీవితము మృదుమధురసుమశయ్యయే కాని, కఠినభూతలము కాదు. కలవంపులెరుగను. తంత్రములెరుగను. మాయలెరుగను.

ఆరోజు— ఏమి మార్పు నాజీవితంలో విద్యార్థిగా బల్లపైన కూర్చుండేవాడిని కుర్చీలో కూర్చునే రోజు. విద్యార్థిగా నున్నపుడు ఉల్లాసంగా పాఠశాలకు పోయేవాడిని. ఆరోజు ఏదో చెప్పలేని భయము నన్ను పట్టుకొన్నది. కొంత క్రొత్త, కొంత భిడియము, కొంత సిగ్గు, కొంత భయము నన్ను ఆవరించుకొన్నవి.

మా అధికారి నవని విషయమును నొక్కి చెప్పటం మూ
లాన నా వస్త్రాలవిషయమై కడవలసిన జాగ్రత పడ్డాను. కట్టు
పంచ మొదలుకొని శిరోధారణవరకు సలక్షణంగాను శాస్త్ర
నిబంధనానుకూలంగాను ప్రవర్తించాను. ఇంత జాగ్రత్తగా
ముస్తాబు చేసికొని నాబాలురతో ప్రథమ పరిచయం చేసు
కొంటానికి బయలుదేరినాను. నా బాలురను చూడవలెనని
నే నెంత తహతహ పడుతున్నానో కొత్త మాస్టరును చూడా
లని వాళ్ళూ అంత వేగిర పడుతున్నారు.

నేను ఆ యిదవ ఫారంలోకి పోవాలని తెలిసింది. ప్రప్రథ
మమున నే పెద్దక్లాసుకు పోవలసి వచ్చిందే అని మనస్సులో అను
కొని, ఒకవిధమైన సంతోషంతో మెడ మెట్లెక్కి క్లాసులోకి
పోయినాను. నేనుపోయినాను అంటం ఒక శబ్దాలంకారం
అనాలె. ఎందుకంటె పోయింది నేను కాదు. నా కాళ్ళు.

కుర్చీలో కూర్చునేసరికంతేను చీమ చిటుక్కుమన్నా విని
పించేటంతటి నిశ్శబ్దంగావుంది. కూర్చునేసరికి నాకు పరమానం
దం కలిగింది. బ్రిటిషు రాజ్యాన్ని ఏలే చక్రవర్తి సింహాసనం
మీద కూర్చున్నప్పుడు ఆయనకు కలిగే ఆనందం నాకు కలి
గిన సంతోషం ముందు తృణసమానము. జయసూచకంగా
ఒక్క చిరునవ్వు నవ్వినాను ఉత్తరం క్షణంలో పిల్లలందరు ఒక్క
మారు బెంచీలమీద ధమధమా అని వాయించినారు ప్రళ
యకాల సూచనార్థమైన పిడుగువలె ఆశబ్దము నాగుండెలలో
మారుమ్రోగింది. ఆచిన్న చిరునవ్వు మెరుపుకు ఇన్ని ఉరు

ములా? నాలోపము ఎక్కడుందో నేనూహించలేక పోయినాను.

సాక్రటీసు కష్టావస్థలో పడ్డాను. సాక్రటీసుకు రక్కసి భార్య ఉండేదిట. ఒకరోజు ఆయన రావటంతోనే ఆమె తర్జన గర్జన భర్జనాది సాధనాలతో ఆయనకు స్వాగతమిచ్చి అంతతో కోపాగ్ని చల్లారక పోవటంమూలాన కుండెడు చన్నీళ్ళు తీసికొచ్చి ఆయన నెత్తిన పోసిందట. పాపము ఆయనకు ఎందుకు అట్లు చేస్తున్నదో తెలియదు. ఆయన నవ్వుతూ ఆ ఉరుములకు ఈ కొద్దిపాటి వానేనా అని అన్నాడట. నవ్వే శక్తి ఉంటే ఎట్టి అవమానాన్ని అయినా అట్లా నవ్వేసి వేయవచ్చు.

నాకు అట్లాంటి అవస్థ వచ్చింది. అందుకని నేనూ, ఆ చిన్న మొగవాళ్ళకు ఇంత పెద్ద ఉరుమా అన్నాను. సాక్రటీసు భార్య ఏం చేసిందో తెలియదు. కాని నా కుర్రవాళ్ళు నాటుకు మళ్ళా ఈలలు కొట్టారు.

ఏమి చెయ్యాలిసింది తోచనికాని ఉపాధ్యాయ ప్రముఖులు ఏమిచేస్తారు అట్టి పరిస్థితులలో. చూడండి. ఒక ఆయన ఆస్ట్రేలియా భూగోళజ్ఞానము బోధిస్తూ ఒక సందర్భంలో Stamping is done in Australia అని చెప్పడం ప్రారంభించేసరికి పిల్లలు ఆ మాటవిని అర్థం అంటుకొని గబగబ ఈలలు కొట్టారు. ఉపాధ్యాయుడు కొంచెముసేపు నిదానించి by asses అని అన్నాడట.

అటువంటి ప్రయోగము ఏదైన ప్రయోగిద్దామంటే ఏమీ

తోచక పోవడమే కాక కాళ్ళు తేలిపోవటము మొదలుపెట్టినవి. సాధ్యమైనంతవరకు గాంభీర్యాన్ని కళ్లల్లో నిలువబెట్టి ఇంగ్లీషులో "నాకు చాల విచారముగా ఉంది" అనేసరికి అందరు ఏకగ్రీవంగా "చో్చో్చో్చో్" అని సానుభూతిని వెలిపుచ్చారు. ఇంతకంటె నీనావస్థ ఇంకేముంది?

ఏమితోచక ఒకవిధమైన దురవస్థలోపడి నేనుకొట్టుకుంటుంటే ఇంతలో ఒక పెద్ద కుర్రాడు లేచినాడు. మీసకట్టు బాగా మోస్తరుగా అమరింది. స్ఫురద్రూపి. కాలు పొడగాటివాడు. వానిని చూచేసరికి నాహృదయంలో ఎట్టి చలనం కలిగిందో కాని మొఖం కళావిహీనం అయిపోయి ఆముదము త్రాగిన వాడి ముఖంలాగ వికారరూపం పొందినదని మాత్రం నాకు తెలుసును.

ఆ కుర్రవాడు నా ముఖంవంక తేరపారచూచి, చప్పున క్లాసులోనుండి బైటకు పోవడం మొదలుపెట్టాడు. "ఏమోయి! ఆగు అట్లా పోవటమే? ఇక్కడున్న ఉపాధ్యాయుడి అనుమతి లేకుండానే? ఇదేమి విపరీతము?" అన్నాను నేను. ఆకుర్రాడు నదురు బెదురు లేకుండా "ఇది పెద్దక్లాసండి." అని ఠీవిగా నడచి పోయినాడు.

ఒక చిరునవ్వు నవ్వి అప్పటికి తప్పించుకొన్నాను. ఇంక ఏదో ఒక దౌర్జన్యం చేయకపోతే పిల్లలు హద్దుమీరి అల్లరి సాగించేలాగున్నారు. వాళ్ళపాఠము చెప్పడం మొదలు పెడదామంటే అది ఏమో నాకు తెలియదు. అడిగితే సక్రమంగాను

విషయంగాను చెప్పే స్థితిలో వాళ్ళు ఏమాత్రంలేరు. నాతా ప్రాణస్థితి ప్రమాదకరంగా ఉంది.

ఇవన్నీ అవగాహనం చేసికొని అమాంతంగా ఒక ఉపన్యాసము ఎత్తుకొని పెద్దపెద్ద మాటలు నోటినిండా పలుకుతూ, తడుముకోకుండా ఒక్కదమ్ముగ గంటకొట్టే పర్యంతం బిపిన్ చంద్రపాల్‌లాగ ఉపన్యాసము కురిపించాను. కొండపైటి జలపాతమువలె వచ్చే ఈ వాగ్ధోరణిచూచి మావాళ్లు చల్లబడ్డారు. ముఖాలు వికసించినవి. కొత్తమాస్టరు గట్టివాడని మనస్సుకు నచ్చింది. నేనూ గండంతప్పి బైట పడ్డందుకు సంతోషించాను. ఆ సంవత్సరానికి ఆక్లాసులో అల్లరిలేదు.

# 3

## శిక్షా స్మృతి.

మొదటిరోజున నన్ను కొంచెం ఒత్తిచూచి ఉపాధ్యాయుని సత్తువ గ్రహించినారు. తరువాత వారము రోజులు నేను పాఠం చెప్పలేదు. ప్రతిదినము ఏదోయొక విషయమునై గంభీరమైన ఉపన్యాసము ఇయ్యటంవల్ల వాళ్ళకు నాయందు కలిగిన ఉద్దేశాన్ని స్థిరపరచాను. ఆవిధంగా నా కష్టాలు గట్టెక్కినవి. కుర్రవాళ్లు నన్ను అర్థంచేసుకొన్నారు. నేనూ వాళ్ళ గుణగతాలు గ్రహించాను. మాయిద్దరిమధ్య కోపద్వేషాలు నశించి పోయి కాలము హాయిగా గడవటం మొదలుపెట్టినది.

అయితే ప్రతి సంస్థకూ, జాతికీ, బృందానికీ ఎల్లాగయితే కొన్ని హక్కులు ఉంటవో అల్లాగే విద్యార్థిబృందానికికూడా కొన్ని జన్మహక్కులున్నవి. మార్కులు బాగా వేయాలె. పరీక్ష పత్రాలు కఠినంగా ఉండరాదు. ఇవి ముఖ్యమైనవి.

ఇవిగాక మరికొన్ని నిబంధనలున్నవి. పరీక్షలో కాపీ చేస్తుంటే ఉపాధ్యాయుడుచూచీ చూడనట్లు ఊరుకొని గుమ్మం దగ్గర నుంచుని చేపను చదువుకొంటున్నట్లు నటిస్తూ పెద్ద మాస్టరు బెత్తంతీసుకొని రావటం కుర్రవాళ్ళకు తెలియపరచాలి. కుర్రవాడు ఆలస్యంగావచ్చినా, ఎప్పుడైనా ప్రమాద వశం చేత పాఠశాలకు రాకపోయినా ఉపాధ్యాయుడు గమనించ రాదు. ఇటువంటివి అనేకంగా ఉన్నవి. వారి న్యాయచట్టము అంతా వివరంగా వ్రాస్తే ఈ చిన్నపుస్తకంచాలదు.

ఈ చట్టాలలో శిక్షాస్మృతిలోని ఒకటి రెండు విషయాలను మాత్రం ఇచ్చట మచ్చుకు చూపిస్తున్నాను. ఏఉపాధ్యాయు డైనా వ్రాయబడిన ఉత్తరములు లేక జవాబులు చూచి తక్కువ మార్కులు వేసినా, విద్యార్థి అనుకొనినన్ని మార్కులు వేయకపోయినా, వేసిదిద్దినా, దిద్దినట్లు అనుమానమున్నా, పత్రంమీద వేసి పెద్దపుస్తకంలో వేయకపోయినా శిక్షార్హుడు.

పైనచెప్పిన తప్పులకు రెండువిధములైన శిక్షలున్నవి. ఒకటి సామాన్యశిక్ష, రెండవది కఠినశిక్ష. బాలురే తప్పిదమునుబట్టి శిక్ష నిర్ణయించవచ్చును. శిక్షితుడైన ఉపాధ్యాయుడు. రాళ్ళు రువ్వుట, అతని పుస్తకములను తస్కరించి దహనముచేయుట,

అతని పేరు నిందావాక్యములతో సంఘటనముచేసి గోడపైన వ్రాయుట, అతని కేదైన విపరీతమైన పేరు పెట్టుట, క్లాసులో ఒకరుకాని, అందరుకాని అతనిని ఎదిరించుట మొదలైన తిరస్కృతులకు లోనగును. పిల్లవాళ్ళు సూక్ష్మబుద్ధి గలవాళ్ళయితే ఇంకను విచిత్రమైన తిరస్కృతులను కనిపెట్టి అట్టిశిక్షార్హుడైన ఉపాధ్యాయునిపై ప్రయోగించవచ్చును.

ఈశిక్షాస్మృతిలోకసవశిక్షకు అర్థం దండతాడనమే. క్లాసులోని పిల్లలలో ప్రత్యేక వ్యక్తిగాని లేక అందరు కలసిగాని సక్రమమైనటువంటియు, ఉత్తమమైనటువంటియు మార్గము ననుసరించి పనిజరుపవలెను అని ఈవిధముగా వివిధ నేరములకు విచిత్రమైన శిక్షలు శాసింపబడియున్నవి.

ఇట్టి చట్టములకు ప్రతి ఉపాధ్యాయుడు లోబడియుండాలని చెప్పటమే ఈప్రకరణం వ్రాయటంలో నాఉద్దేశం. అట్లు లోబడక చట్టతిరస్కారముచేసిన ఉపాధ్యాయులు అనుభవించవలసినదంతా అనుభవించారు.

బంగారయ్యగారు మార్కులు వేయలేదట! రాత్రివేళ కొందరు కొంటెపిల్లలు ఆయన ఇంటికిపోయి, ఆయనను బయటికి పిలిచి కొట్టదలుచుకొన్నారు. కాని పిలిస్తే ఆయన బైటికెందుకొస్తాడు? అందుకని ఒక ఉపాయం ఆలోచించారు. బంగారయ్యగారి బావమరది బందరులోనున్నాడు. ఆయన వ్రాసినట్లుగా ఒక ఉత్తరంవ్రాసి, అందులో అతడు రాత్రి బండికి వస్తాడన్నట్లుగా వ్రాశారు. పాపము ఆరాత్రి బంగా-

రయ్యగారు బావమరది వస్తాడని అనుకొంటూ వుండంగానే "ఒరే బంగారూ" అని ఎవరో అస్పష్టంగా పిలిచారు. కుర్ర వాళ్లకు చదువు చెబుతున్న బంగారయ్యగారు "మా అన్నయ్య వచ్చేడేవు" అని గదిలోకి కేకేసి చప్పున తలుపు తీశాడు. పిలిచిన దేవర్ని చూచి గ్రహించేటప్పటికే నెత్తిమీద గుద్దుపడ్డది. ఢడిపెడి దెబ్బలు పడ్డవి. ఇంతలో అన్నయ్యగారు పారిపోతున్న సంతోషంలో చెంబులో నీళ్లుతీసుకొని లోపలనుంచి 'అన్నయ్యా' అంటూ వచ్చింది. ఆమె రావటంతోనే కుర్రవాళ్లు ఎక్కడివాళ్ళక్కడ పారిపోవటం చూచి గాభరాపడి 'అమ్మో, ఇదేమిటి, ఇదేమిటి' అని అన్నది. దూరాన నుంచి ఒకడు 'ఏమీలేదు అమ్మాయీ, బావగారితో'—

ఇది కఠినశిక్షక్రింద ఉదాహరణము.

సుబ్బారావుగారు పరీక్షలో కాపీచేస్తున్న కుర్రవాడిని కొట్టి నందుకు అతనికి "డబ్బా" అని పేరుపెట్టారు. ఆ నామము గోడలపై వ్రాయుట మేకాకుండా, ఊళ్ళో అన్ని భాగములలో ఉండే ప్రజలకు వెల్లడి అయ్యేనిమిత్తం స్వేచ్ఛావిహారం చేసే ఆబోతుపై వ్రాయబడి బస్తీ ప్రజలకు ప్రకటింపబడ్డది. ఆయన భార్య "పాలడబ్బా తేవాలండీ" అని అనటానికికూడా భయపడేది. ఇది సామాన్యశిక్షకు తార్కాణము.

ఇట్లా శిక్షాస్మృతి ఘోషిస్తుంటే ఏ ఉపాధ్యాయుడు చట్టము నెదిరించి ప్రవర్తించగలడు? నేను క్రొత్తగా ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించాలనికాబోలు, ఒక పెద్దమనిషి

విచారం వేసింది. ఆయనమాటుకు ఒకటే నవ్వటం.

'ఈరోజు నాకు అన్నం బొత్తిగా సయించలేదు' అని ఆయన దినచర్యలో వ్రాసుకొన్నాడు. ఇది కూడా సామాన్య శిక్షకు ఉదాహరణమనే పాఠకులు గ్రహింతురుగాక.

నాగరాజుగారిని విద్యార్థులు, ఏదో ఆకతాయి మంచిమాట చేసినప్పుడు ఆయనవెళ్ళి రామమూర్తిగారితో మొర పెట్టుకొని "అయ్యా, నేను ఉపాధ్యాయవృత్తి సాగిస్తాను జీతంకోసం గుంజేను. దెబ్బలు తిని మళ్ళీ ఏ ముఖం పెట్టుకొని బడి మందిలో తిరిగేది" అన్నాడు. రామమూర్తిగారు సహజ గాంభీర్యంతో — "ఏ ముఖంతోనా?— ఉపాధ్యాయుడి ముఖంతో—అయితే ఎన్నిసార్లు నీవు దెబ్బలు తింటున్నా" అని సాగరసదృశమైన గాంభీర్యంతో అడిగాడు. నాగరాజుగారి పాలంకళ్లు తేలూస్తూ "ఎన్నిసార్లకూడాఅండి నాకిర్మింకా లేదే!" అన్నాడు. అప్పుడు రామమూర్తిగారు గొంతు సవరించుకొని "ఓస్, యిందుకేనా ఇంత! పిచ్చివాడా!, నీజీవంలాంటి ఉద్యోగాన్ని వదులుకొని నోట మన్నుకొట్టుకుంటావా? ఎవరుచెప్పారు నీకాసంగతి! ఎవరు చెప్పారంటూ! అవమానమూ! ఇటువంటివి పెట్టుకుంటె నెగ్గినట్టే! నాజీవితం ఆదర్శంగాతీసుకో. నన్నుజూచి ధైర్యం తెచ్చుకో. ఎందుకు పిచ్చిన పడతావు. కొట్టారు అంటావు? కొట్టింది ఎవరిని? మొదట నన్ను నెల్లూరులో కొట్టారు. తరువాత గుంటూరు స్కూలులో పనిచేస్తుంటే అక్కడ కొట్టారు. అటు తరువాత

నూజివీడులో, తరువాత ఏలూరు, దెందులూరు, ఆత్మకూరు, అనకాపల్లిలలో కొట్టారు. విశాఖపట్నంలో సముద్రపుఒడ్డున పడేసికొట్టారు. రాజధానికి మూలపడి ఉందామని ఈ బరంపురము వస్తే ఇక్కడా కొట్టారుగదా! కాబట్టి దెబ్బలూ తిటం ఈజీవితంలో సామాన్య విషయంగా ఎంచి ధైర్యంగా తిరుగు" అని రామమూర్తిగారు సలహా ఇవ్వడం నాకు తెలుసు.

కాని నేను జాగ్రత్తగా ఉండి కుర్రవాళ్లయందు అనురాగం కనపరచి, కొత్త శిక్షలకు లోపడకుండా తప్పించుకొన్నాను. నమ్మరూ!

# 4

## లంగాడీ ప్రకరణము.

పాఠశాలలలో తెలుగు పండితులకు మాత్రిగా గౌరవం లేకపోవటం, ఆక్లాసులో పిల్లలు విజృంభించి అల్లరిచేసి ఇతరక్లాసులలోకూడా పనిజరుగకుండా చేయటం అందరికీ తెలిసినవిషయమే. ఇంగ్లీషుక్లాసులో నోరెత్తి రెండుమాటలు మాట్లాడలేనిగుంటడికి తెలుగు క్లాసులో వల్లమాలిన తెగింపు వస్తుంది. ఇతర క్లాసులలో బెంచీలతోపాటు నిర్జీవ ప్రతిమలలాగు ఉండేవాడు ఈక్లాసు వచ్చేసరికి సజీవుడై గొంతెత్తి ఉపన్యాసాలు ఇస్తాడు. అంతేకాకుండా ఇంగ్లీషు క్లాసులో మూగవోయిన అతని సరస్వతి తెలుగు క్లాసులో ఛణక్ మని నాట్యం చేస్తుంది.

ఇటువంటి అవస్థలన్నీ చూచి మా ప్రధానోపాధ్యాయుడు తెలుగుయందు అభిమానంగల నన్ను తెలుగు పాఠాలను చెప్ప టానికి నియమించినారు. ఇంగ్లీషు భాషాపండితులు తెలుగు చెబితే అంతనిష్ఠాపుంలో అస్సలు ఉండదని, బోధన నూతన పద్ధతు లను అనుసరించి ఉండి సుగ్రాహ్యమై సాఫల్యానికి మూడినవు తుందని ఆయనగారి ఊహ.

నేనూ తెలుగుభాషయందుండే అభిమానంవల్ల తెలుగు పాఠాలు చెప్పటానికి ఒప్పుకొన్నాను. నాకు భాషలో పాం డిత్యంలేదు. కాని పరిచయం మాత్రం ఉంది. కాబట్టి ఇంటివద్ద చదువుకొని వచ్చి బోధించలేకపోతానా అని అను కొన్నాను.

నాకు తెలుగులో పాండిత్యం లేదని వ్యాకరణం క్షుణ్ణంగా చదివి యుండలేదని ఎట్లా తెలిసిందో మరి; కొందరికి తెలిసింది— తెలిసిందని నేననుకొంటాను. నిజానికి, వ్యాకరణంతో పరి చయం కలుగజేసికొన్నాను గాని పరీక్షకు నిలబడలేను. ఎప్పుడు చెప్పవలసినమాత్రం అప్పుడు తప్పించుకొని పోదామని మనస్సు లో సంకల్పించుకొన్నాను. అసలు రహస్యం అదీ.

అయితే ఆరోజున ఆ పొడగాటి కుర్రవాడు వచ్చి "లంగూ డీ" అంటే ఏమిటండీ అని నన్ను అడిగినదాకా నాకు వ్యాకర ణపరిభాష రాదని నేననుకోలేదు. అతగాడొచ్చి వినయంగా "మాస్టారూ! లంగూడీ అంటే ఏమిటండీ" అని నన్ను అడి గాడు. "లంగూడీ! లంగూడీ ఏమిటోయి? అయినా

ఇప్పుడు ఆవిషయం తెచ్చి పాఠం పాడుచేస్తావేమి, "సమానంబు నం బ్రాతాదులు తొలియచ్చు మీఁది నర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనే సూత్రం అర్థం అయిందా అన్నా." "అయిందండి మాస్టారూ! ఇప్పుడు నేనడిగిన మాట వ్యాకరణసంబంధమైనదేనండి" అని వినయము ఉట్టి పడుతూ ఆ కుర్రవాడు విషయం విశ్లేషించాడు. వ్యాకరణం నేను బోధిస్తున్నప్పుడు తత్సంబంధమైన విషయములు వచ్చినప్పుడు సరియైన సమాధానం చెప్పటం నాకర్తవ్యమే అని క్లాసులో కుర్రాళ్లు అంతా అభిప్రాయపడ్డట్టు వాళ్ళ ముఖలక్షణాలవల్ల నాకు బోధపడ్డది. "సరే. ఆమాట నీకు ఏ వ్యాకరణంలో వచ్చింది?" అన్నా. "తా. వెంకయ్య వ్యాకరణం చదువు తుంటె ఆమాట వచ్చిందండి. అర్థం తెలియక అడిగానండి" అని ఆకుర్రాడు అన్నాడు.

ఇదివరకే నాకేదో వ్యాకరణం క్షుణ్ణంగా రాదని అనుమాన పడుతున్న పిల్లలముందు వ్యాకరణపరిభాషలో ఒక్కపదానికి అర్థం చెప్పలేకపోతే నా గతి ఏమవుతుందా కొంచెం ఆలోచించండి. అందులో ఇదివరలో ఒకసందర్భములో వాళ్ళతో నేను చిన్నయసూరి, సుప్తార్థప్రకాశిక, ఆంధ్ర శబ్దానుశాసనము, ప్రౌఢవ్యాకరణము, త్రిలింగ లక్షణము, అధర్వణకారికలు మొదలైన గ్రంథాలు చదివియున్నానని చెప్పాను. అప్పుడే పిల్లలు ఒకరిమొఖం ఒకరు చూచుకొని తలలొంచుకొని ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు. ఇపుడు తా. వెంకయ్య

వ్యాకరణంలోని పదానికి అర్థం చెపటానికి నీళ్ళు నమిలితే ఆ పిల్లలు నాకేమి రాదు అనుకోవటమే కాకుండా, వాళ్ళ భాషలో, సారకాయలు సరికాదు, అనుకొంటారేమో అని భయం వేసింది.

నాకే కాదు, ఈ పుస్తకం చదివే మహాశయుడ్ని, వ్యాకరణశాస్త్ర విశారదుడైన వాడ్ని, ఎవరైనా ఇట్టి ప్రశ్న వేస్తే భయం వేస్తుందా వేయదా చెప్పండి. "ఆంధ్ర వ్యాకరణ బోధనోపక్రమణంలోనే పిల్లుకూనలు పైబడవలెనా" చెప్పండి. ఎంతసేపు ఆలోచించినా, జ్ఞాపకశక్తిని ఎంత త్రిప్పినా అటువంటి పదము విన్నట్టే జ్ఞాపకం లేదు.

తెలివిగా తప్పించుకొందాము "అబ్బాయి" రేపు చెపుతాను. ఇప్పుడు ఒకే నిమిషంలో చెప్పటం కష్టం. గంటకొట్టుతున్నారు చూశావా! (అదృష్టవశాత్తూ గంటకొట్టారు.) అని ఆసమయానికి యుక్తియుక్తంగా తప్పించుకొన్నా. మర్నాడు మళ్ళీ వాడు జ్ఞాపకం ఉంచుకొని నన్నడగడని మొండి ధైర్యం.

అయినా ఎందుకైనా మంచిదని ఆ రోజురాత్రి అంతా, తా. వెంకయ్య వ్యాకరణం ఆద్యంతం ప్రతివాక్యమూ శల్యపరీక్ష చేస్తూ చదివాను. ఆపదం ఎక్కడా కనుపించలేదు. మరునాడు శాస్త్రిగారిని అడిగా, ఏదైనా సంస్కృత వ్యాకరణ సంబంధమైన పదమేమోనని. ఆయన చాలసేపు ఆలోచించి "ఇటువంటి పదము ఎక్కడా లేదండి. వాడు మిమ్మల్ని వేళాకోళం చేస్తున్నాడేమో' అని అన్నారు. నన్ను అంటే ఇంగ్లీషుభాషాపండితుడ్ని వేళాకోళం చేస్తున్నారనే మాట వినే

సరికి మనస్సులో వేళాకోళానికి వెక్కిరింతలకు నే నేమైనా మాష్టార్లు తెలుగు పండితుణ్ణా అనే భావం పరుగెత్తుతూ ఉపశాంతికి కారణమైనా, శరీరం కాక ఎక్కనే ఎక్కింది. నాటి ఉపాధ్యాయుడిని ఏమీ అనలేక గుటకలు మ్రింగి క్లాసులోకి పోయి, ఆమాటసంగతే మరచిపోయినట్లు నటిస్తూ పాఠం మొదలుపెట్టి చెబుతున్నాను. నేను ఊసుకొన్నా వాడు ఊసులో లేదు. వాడెందుకు ఊసుకొంటాడు? వాడు తార్తారు వంటివాడు.

వెనక రష్యనులకు తార్తారులకు యుద్ధం జరిగింది. అనేక యుద్ధాలలో జయించిన రష్యనుడు మహాగర్విష్ఠుడు. కాని ఆ యుద్ధంలో రష్యనులే ఓడిపోయి పరుగెత్తటం మొదలు పెట్టినారు. తార్తారులు వెంబడించినారు. కొంతదూరం పోయిన తరువాత రష్యను సైనికుడొకడు తన సేనానితో "తార్తారుని పట్టుకొన్నాను కొంచెం వచ్చి నాకు సహాయం చేయవలెను" అన్నాడు. సేనాని గుసగుసగా, "మునుపటి ఆగటానికి వీలు లేదు. వాడిని లాగుకొనిరా" అని గర్వంతో అన్నాడు. రష్యనుడు మళ్ళీ, "వాడు రానటంలేదు. నీవు రావాలె" అని పెద్దగా అరచాడు. సేనాని "ఒరే, ఆగటానికి ఏమాత్రం వీలులేదు. వానిని వదిలేసిరా" అని ముందునుంచి కేకేశాడు.

"నేను వదలినా నన్ను వీడు ఏమాత్రం వదలటంలేదు" అని వెనకనుంచి రష్యనుడు ఎలుగెత్తి అరచినాడు.

ఆ విధంగా ఆకుర్రాడు నన్ను వదలక మళ్ళీ [illegible] రమ్మే సరికి నా ప్రాణం విసుకెత్తింది. దౌర్జన్యంగా వాడిని కూచో

పడితే నాగౌరవానికే నష్టం. కొన్నిమూలలలో అప్పుడే గుస
గుసలు వెకిలి నవ్వులు బయలు దేరినవి. ఏమిచేసే ! "సరే, ఆ
వ్యాకరణం ఇక్కడ తీసుకొచ్చి, ఆమాట ఎక్కడుందో ఒక
మాటుచూపించు" అన్నా.

వాడు నిజంగా వెళ్ళటానికే జడిగినట్లయితే యిప్పుడు
దివిటీముందు దీపం అయిపోతాడని నా ఉద్దేశం. కాని వాడు
నిజంగా పుస్తకం పట్టుకొని రావటం చూసేసరికి, నాగుండె
కొట్టుకొందో, కళ్ళు కాంతివిహీనం అయిపోయినవో, ఏమైందో
మీరు ఊహించుకోండి.

తీసుకొచ్చి పుస్తకం ముందుపెట్టాడు. అప్పుడు ఒకకొత్తఎత్తు
ఎత్తి "ఈపుస్తకం నేఛం పుస్తకము. దీని నిండ తప్పులే" అని
తప్పించుకొనే మార్గాన్ని తెరిచియుంచుకొని "ఎక్కడుందిరా
ఆమాట" అని అసలు విషయానికొచ్చాను.

వెంటనే వాడు తెరిచి వేలుపెట్టిచూపాడు. వాడిమాట
నిజమే ! లంగూడి అని ఉంది. ఇందాక తెల్లపోయిన వ్యాకరణ
విశారదులూ, కౌముదిని తలక్రిందుగా అప్పజెప్ప ప్రజ్ఞగల
ఆచార్యులూ, (ఈసంబోధన ప్రథమ మీచెవులకు కొత్తేమో
విని(గి) లంబూకి పదం వ్యాకరణ పరిభాషలో చేర్చుకోండి.
మా కుర్రాడు చూపించిన వంక చూడండి అ, ఆ, ఇ, ఈ,
లంగూడి, అనే వాక్యం ! అది.

అవునవును, మాహైస్కూలు విద్యార్థి విషయమై మీకి
ప్పుడే ఉదాసీనభావం కలిగిందని తోస్తుంది. అక్కరలేదండి,

నాటకంలో మొదటిపద్యానికి నాంది యని పేరని అందరికి
తెలుసుకదా! దానిపేరు వాళ్ళ సంస్కృతనాటక రచనాసాంప్ర
దాయాన్ని అనుసరించి నట్యాదులలో సంభాషించే సూత్ర
ధారుడు వస్తాడాయె! ఈ రెంటికి ఏదో పెట్టి దాంపత్యము కుదిర్చి
నాంది యనునది సూత్రధారుని భార్య అని వ్రాసి నాటకానికి
సంబంధంలేని నాందిని ఒక ఇంటిదాన్ని చేసి ఇంత పసుపూ
కుంకుమా, ఇప్పించిన కాలేజీ విద్యార్థిచేత మెప్పువడసి
భ్రాతృత్వము స్వీకరించిన, నూతన స్రష్ట ఉజ్జ్వలకు చదువరులు
జోహారులు చేయక పోవటం వట్టి అన్యాయం.

## 5

### వ్యాకరణ బోధ.

"సర్వవిశ్వే కతర కతమ చ ఉభయద్వి నేను సమ పూ
ర్వపర అవర దక్షిణ ఉత్తర ఎకత్ కియతు త్యాదయః
సర్వాదీని శబ్దాని సర్వనామసంజ్ఞాని స్యుః" అని సర్వనామాలకి
నిర్వచనంచేసిన వ్యాకరణకర్తను ప్రశ్నించుకొని తెలుగు పాఠా
లుచెప్పే ప్రాముఖ్యతకు ముడివేసుకొని నూ పిల్లలకు సర్వనామ
పదవ్యుత్పత్తిని గురించి చెప్పి దాని ప్రాధాన్యాన్ని గురించి
బోధించి దాని ప్రయోజనాన్ని గురించి వివరంగా వ్యక్తపరచి
ఇంకా సదర్శనంగా ఉండటానికి ఏ రామకథో మొదలుపెట్టి
రామాయణమంతా రాముడు రాముడు అన్న నామవాచక

పునశ్చరణతో నింపేస్తే అది రామకోటిలాగుండి మోక్షప్రద మైతే కావచ్చుకాని వ్యాసంమటుకు ఎంతసొంపుచెడి యుంటుందో చూపి వ్యాసరచనలో సర్వనామముయొక్క వాడుకవల్ల వ్యాసానికి జిలుగులు ఎట్లా దిద్దవచ్చునో కనబరచాను. పిల్లలందరికి చక్కగా విషయం మనస్సుకు ఎక్కింది అందులో సందేహం ఏమీలేదు.

అయితే ఆ విషయం వాళ్ళ బుర్రల కెక్కటంలో వైపరీత్యమేమీ లేదు కాని, వాళ్ళ మనస్సులలో అది పొందిన పరిణామమే విచిత్రము. ఆ సాయంకాలం గ్రామం లేచి ముఖంమీద పడుతున్న జుట్టును పైకి అనపే తెనాలివిల్ల ఒకడు చిక్కని సందేహం ప్రదర్శిస్తూ నేస్తూ "ఆ వాడు వీడు తాను నే నేనా అండి సర్వనామాలు; నే పోతే ఒక్కల్లకుండే కొంటె పిల్లలు మాలో మేము సంభాషించేటప్పుడు నాకంటే నాకు ఆ వాడు ఎవరో తెలుస్తుందే! అది కూడా సర్వనామమేనాండి" అన్నాడు. ఆ ప్రశ్న వినేసరికి అవేవో భయంకర ఊహలు మహాకృతిగా నా మనస్సులో పరిగెత్తటం మొదలుపెట్టినవి.

ఇంతలో వాడు వేసినప్రశ్న స్పష్టంగా తోచకపోవటంచేత నాకు అర్థంకాలేదు అను కొనికాబోలు "అదికాదండి మాస్టారూ! ఇప్పుడు ఒకామెకు చిట్టిగారె అని పేరుంది అనుకోండి, ఫలాని ఆయనకు చిట్టిగారెలంటె ఇష్టము. 'ఫలానా ఆయన చాలా మంచివాడు' అని అనకుండా, 'చిట్టిగారె చాలా మంచి వాడు' అంటే, రెండు వాక్యాలలో చెప్పవలసిన భావం ఒక్క

వాక్యంలో ఇముడటం కాక, "చిట్టిగారె" అనేపదం సర్వనామము
ఇచ్చే ప్రయోజనాన్ని ఇస్తుంది కాబట్టి. ఇదికూడా సర్వ
నామములేనాండి" అని కళ్లల్లో తెలిపి వికృతంగా వెలిగించు
కొంటూ అన్నాడు. అప్పటికి నాభయాలన్నీ భయంకరజీమూ
తాలలాగు నన్ను ఆవరించుకొన్నాయి. "నాకు చిట్టిగారెలు
ఇష్టం అనేసంగతి వీళ్ళకేమైనా తెలిసిందా చెపుమా" అని
నాలోనేను కళ్లు బిగబట్టుకొని అనుకొన్నాను. తెలిసే అట్లా
చేస్తున్నారని అనుమానపడ్డాను గనుక బెట్టు నేను తగ్గించుకోవలసి
వచ్చింది కాని అప్పట్లో ప్రాణాలన్నీ కళ్లల్లో నిలబెట్టి "ఒకే
అచ్చాయి, ఈధాతు యుష్మదస్మదర్థంబులమీంద దక్క నుండదు
పేర్ల ఉకారాంతకాంత శబ్దంబులకు ద్వితీయాషష్ఠుల ఇకారోకారం
చకారంబులు నిషేధంబులు" అని అథర్వణకారికలలో ఉంది.
వాడి నవ్వు చెప్పింది: ఎట్లా నడిపోతుంది; తెలిసిందా?" అని
వ్యాకరణ ప్రణేతకుమల్లె ఒక్కబిగువున సూత్రాన్ని ఊదేసి
"నీకు ఈమాత్రం తెలియదా" అనేభావాన్ని, "నాకెంత
పాండిత్యపటిమ ఉందో చూశావా!" అని ప్రకటించే
భావాన్ని తనలో జోడించుకొన్న ఒక్క చిరునవ్వు నవ్వేసరికి,
ఏమీ తెలియని కారణంచేత కామాలు అందరూ వాడివంక
చూచి "మాడావ్రతే ఊళ్ళకో" అన్నచూపులు చూశారు.

అల్లా దౌర్జన్యం చేసి ఆరోజు అవమానాన్ని తప్పించుకొన్నా.
ఆబడాయిలు చేసిన కొంటెతనం, దానికి సహజమైన పరిణామాన్ని
పొందనే పొందింది. మర్నాడు బోర్డుపైన గారెలబుట్టబొమ్మ

గీశాను. దానికూడా చిట్టిగారెలున్నవి. బొమ్మనాయనకు బాగా
వుంది నాకు కోపంవచ్చే విషయం కాకపోతే దానికి నాటికి
సొంతమాటగా ఇచ్చేవాణ్ణి. అయినా కథా నైపుణ్యాన్ని
లోలోన మెచ్చుకొని గుటకలు మింగి ఊరుకొన్నాను. అటు
పైని వారం రోజులు గడిచిన తరువాత ఒకరోజు నేను వ్యాకర
ణం చెబుతూ, "కుఱు-చిఱు-కడు-నడు-నిడు శబ్దముల ఱడల
కచ్చుపరంబగునపుడు ద్విరుక్తటకారంబగు" అనే సూత్రాన్ని
బాలబోధినీ సూత్రముల ప్రకారం బోధపరుస్తూ ఉదాహరణ
క్రింద 'కుఱు+ఉసురు=కుట్టుసురు, చిఱు+ఎలుక=చిట్టెలుక,
నడు+ఇల్లు=నట్టిల్లు, కడు+ఎదురు=కట్టెదురు' అనునవి ఉదాహ
రించి శ్రమపడి చెబుతుంటే అంతా చెవులు నిక్కపొడుచు
కొని వింటున్నారు. ఇంత నిశ్శబ్దంగా ఉండటం ఏదో ప్రళయ
సూచనే అని నేను అనుకొంటూ ఉండంగానే మళ్లీ ఆపొడు
గాటి కుర్రాడు లేచి "సార్! చిఱు+గారె=చిట్టిగారె అవు
తుంది గాదండీ" అన్నాడు. అర్జునుడు కర్ణుడిపైకి సర్పాస్త్రము
ప్రయోగించినప్పుడు చూచిన మాదిరిగా "వ్యాకరణాలలో
తప్పినా, సంధిలో తప్పలేదురా బాబూ నాకీ చిట్టిగారె
సంధానం" అని అనుకొని ఏమీచేయలేనప్పుడు మొదలకుండా
ఊరకోవాలె అనే రాజనీతిని స్మరించాను.

ఆరోజునుంచీ చిట్టిగారె అనే పదం నాకు సార్థం అయి
పోయి నాకున్న బిరుదులతోపాటు చేరిపోయింది. బిరుదు
లన్నిటిలోను అదే గొప్పదైనట్లూ, దానికున్న ప్రాముఖ్యం

దేనికీ లేనట్లూ, వాళ్ళు నన్ను 'చిట్టిగారె సూస్తారు' అని పిలుస్తారట. నా ముఖం చూసేగాని ఎవరూ అనకపోయినా నాకున్న సర్వనామం అని. సర్వనామము అంటె సర్వత్రా ఉపయోగించే నామము. ఇదీ మా కుర్రాళ్ళు ఇచ్చిన నిర్వచనము.

ఇటువంటి సర్వనామాలు అనివార్యంగా వస్తవి. మాస్టరు నల్లగా ఉంటే కాటికాకి అంటారు. ఎర్రగా ఉంటే దొండపండు అంటారు. పాలిపోయి తెల్లగా ఉంటే సున్నపు పిడత అంటారు. సన్నగా ఉంటే పీక అంటారు. లావుగా ఉంటే బాయిలర్ అంటారు. బొజ్జ పెద్దదైతే కూష్మాండం అని, పొట్టిగా ఉంటే మొట్టువంకాయ అని అంటారు. కళ్ళు మసకైతే కబోదిపక్షి. ఒకకన్ను గుడ్డి అయితే శుక్రాచార్యి. పాఠం బిగ్గరగా చెబితే డప్పు, మెల్లగా చెబితే బోరు. గబగబా నడిస్తే మెయిల్, మెల్లగా నడిస్తే స్నెయిల్. కాబట్టి ఎట్లావున్నా ఒకపేరు అతికిస్తూంటారు.

అయితే ఈ పేర్లు తీసడం పిల్లలతో పాటు సరదాగా తిరుగుతూ, వాళ్ళకు చనువు సంపాయించాలనే మాట తలపెట్టని వాళ్ళవిషయంలో మాత్రం నిషేధము. ఏదో చెప్పి చెప్పక తప్పించుకు తిరిగే మాష్టర్లవిషయంలో బహుళము కాని కష్టపడి చెప్పేవాళ్ళవిషయంలో మాత్రం నిత్యం!

కొత్తసూత్రాలు కల్పించటంలోకి కూడా మా కుర్రాళ్ళ జ్ఞానం వ్యాపించింది. 'నామంబులకు సమానమైన యర్థంబు స్ఫురించు వేరొక శబ్దంబు తత్సమంబు' అని సూత్రం చేశారు.

జానకిరామయ్యగారికి తోటకూర ఇష్టము. కాబట్టేన్ని, తోటకూర మాష్టారూ అన్నప్పుడు జానకిరామయ్యగారి పేరు తప్ప ఇంకోపేరు స్ఫురించదు. కాబట్టేన్ని తోటకూర అనే శబ్దం తత్సమమైంది. చిట్టిగారె, పులిహోర, గోంగూర, కంది పచ్చడి, సొరకాయ, సాంబారు, మొదలైన శబ్దంబులు కొన్ని కొన్ని వ్యక్తులయెడ తత్సమశబ్దాలైనవి.

ఇట్లు సర్వనామశబ్దములలో [illegible] చేరిన కొంతజ్ఞానం తత్సమశబ్దములలో ప్రవేశించి తద్భవశబ్దములలోకి పాకింది. "వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములచే తద్భవంబులగు" అనే సూత్రం వాళ్ళకు మనస్సుకు పట్టిన తరువాత, అది వాళ్ళ కల్పనాశక్తులకు ఉత్తేజం కలుగజేసింది కాబోలుమరి. మాష్టర్ల పేర్లు, ఆలోప ఆగమ వ్యత్యయాలను పొంది తద్భవరూపాలకు మాతృత్వం సంపాదించుకొన్నవి. శుద్ధిగచిచ్చు, ప్రకాశమ్ పగడము, రత్నం అందము, అయినట్లుగానే నరసింహం నరుసు, జానకిరామయ్య జ్యాక్ అనే రూపాలను పొందటం మొదలు పెట్టినవి. నాతోడి ఉపాధ్యాయుల పేర్లూ, నా పేరూ, నా స్నేహితుల పేర్లూ మా పరీక్షాధికారి పేరు, చివరకు తల్చుకొంటే గుండెకొట్టుకుంది. మా ప్రధానోపాధ్యాయుడి పేరుకూడా ఆ వర్ణలోప ఆగమ వ్యత్యయాలకు లోనగునట్లు చేయటమే కాకుండా వాటిని గోడలమీద వ్రాయటం మొదలుపెట్టారు మాకుర్రాళ్ళు.

నేను వేసిన వ్యాకరణబీజాలు మొలకలెత్తి మహావృక్షాలై

ఇట్టి విపరీతపు ఫలాలను ఇస్తాయని కలలోనైనా అనుకోలేదు. ఐతే మాకుర్రవాళ్ళ తెలివితేటలకు ముఖ్యంగా వాళ్ళకు పేర్లను కల్పించటంలోగల ప్రజ్ఞకు నేను లోలోన ఆనందించాను. అయితే మా ఉపాధ్యాయులలో పేదగుండె కలవాళ్ళు, నా తెలుగుబోధనవల్ల నాలికి మారుపేర్లు పుట్టటం సహించలేక ప్రధానోపాధ్యాయునితో చెప్పుకొన్నారు.

ఈవిషయం పెద్ద అధికారివరకూ వెళ్ళించని నాగుండె గుభేలుమన్నది. ఆయన మంచి పుస్తకాలలో ఎప్పుడూ ఉండాలని ప్రయత్నించేస్తున్న నేను, ఆయనసే నాకు జీవనాధారం కల్పించిన దేవుడని నమ్మియున్న నేను, నాఅమంగళుపుత్రులని మాప్రధానోపాధ్యాయుని పేరుతోకాని ముద్దుపెట్టుకోని నేను, నాఉదరపోషణకోసం, నాఉద్యోగం స్థాయిత్వం కోసం ఈ పని చేయడానికి ఒప్పుకొన్న నేను, నేను నేనని కొడి ఉపాధ్యాయులకు తెలిసిన నేను ఈమాట విని విధిని నిందించుకొని ఉద్యోగానికి నీళ్ళు వదలుకొని దరిద్రదేవతను ఆహ్వానించుకొన్నాను.

మా ప్రధానోపాధ్యాయుడు మర్నాడు నన్ను పిలిపించారు. ఆగదిలోకి పోవటం అంటే నాకు యమునిలోకంలోకి మహానరక బాధలు అనుభవించటానికి పోయే జీవుడికిమల్లె, గాలి తాకుడుచే రాలిపోయాకువలె, కంపించిపోయినాను. ఏదో ఇంత కలో అంబలో త్రాగి బతికకుండా నాకు ఈఉపాధ్యాయవృత్తి ఎందుకొచ్చింది? వచ్చిందనుకో! ఈవ్యాకరణ బోధన ఎందుకిచ్చారు? ఇచ్చారయ్యా ఈకుర్రాళ్ళు యిల్లా విపరీత పోకడలు పోవటం

ఎందుకు? పోతేమాటుకు ప్రధానోపాధ్యాయునికి ఎందుకు తెలియాలి? అది యింకొ సేపు పరితాపం పొంది, ఆ ఆపదనుండి తప్పించమని శ్రీకృష్ణుని ప్రార్థించి, "లావొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యె" అనే పద్యం చదువుకొంటూ, అడుగు గడుగుకూ, రాధామాధవుల్ని ధ్యానం చేస్తూ ఆయన గదిలోకి వెళ్లాను.

అయితే శ్రీకృష్ణభగవానులు ఆ సుముహూర్తంలో మూరి ఆయనను నాకు ప్రసన్నవదనుణ్ణిగా చేశారు. నేను పడ్డ అవస్థ అంతా నట్టి విభ్రమము. ఈ పేస్ట్ పెట్టటం గురించిన కథ అంతా ఆయన విని ఆనందించి తెగనవ్వి, అయ్యా, ఈ వృత్తి వృక్షాన్ని ఆశ్రయించుకొన్న పక్షులు ఈసంఘటనలు. మనం వాటిని తరిమివేయలేము. అవి అట్లా ఉండటమే ఆనందం. కమలంమీద తుమ్మెద వ్రాలుతుంది. భ్రమరముయొక్క కాళ్ళ తాకిడిచే పుష్పానికి తాత్కాలికంగా బాధ కలిగినా ఆ తుమ్మెదవల్ల పుష్పానికి శోభే కలుగుతుంది. అట్టి పుష్పమే చిత్రకారుని సృష్టిలో సంపూర్ణమైన సౌందర్యముతో కూడిన వస్తువ అని నాకు నచ్చచెపటమే కాకుండా, ఉపాధ్యాయుని వృత్తిలో ఇదియొక మాధుర్యం అని అందరికి తెలిసేటందుకోసం ఏవ్యాకరణపరిభాషల ప్రకారం ఏపేరు ఎట్లా మారింది అంటే నరసింహం నాసిగాను, వెంకయ్య వెంకాయగాను, ఉమామహేశ్వరరావు ఏమూ రామేశ్వరరావుగాను, రాజారావు గాబారావుగాను, వరదాచారి బురదాచారిగాను ఎట్లెట్లు మారినవో,

వ్యాకరణ తెక్కలలో ఓడించి, విషయానుక్రమణికతో సహా ఒక లిస్టు తయారుచేయమని ఆయన నాకు చెప్పి 'బతికానురా బాబూ' అని నేను నవ్వుతూ ఉంటే, తన పేరుకూడా ఆ చిట్టాలో వుంచి తీరాలని చెవులో ఆన పెట్టాడు మహానుభావుడు రసజ్ఞుడు ఆయన. ఆఖరుమాటలు ఏమిటంటే ఈ అల్లరి అఘుష్టంలో ఆగక సంహారప్రకరణంలోకి వాటి ఇద్దరు ఇద్దరి మేస్టర్ల పేర్లు కలిసి ద్వంద్వసమాసంగా తయారైనవి. వట్టి రోజుల్లో ఉపాధ్యాయజీవితసాధుర్యాన్ని అవి వేయినోళ్ళతో చాటుతూ ఉన్నా ఇన్‌స్పెక్టరు వచ్చినరోజులలో మాత్రం గోడలపై వేలాడుతూ సున్నపుపూతయొక్క తెలుపులో నుంచి అసలు పేర్లు తొంగి చూస్తూఉంటవి.

# 6

## వాళ్లు—వీళ్లు

౧

అసలు ఈప్రకరణానికి 'వారు వీరు' అని నామకరణం చేద్దామనుకొన్నాను. 'వారు' అనేసర్వనామము ఒక యాథార్థంలో వాడుతున్నాను. మావారు అంటే భర్తకు, మా వాళ్లు అంటే భార్యకు ఎల్లాయాధమో, వారు అంటే అధికారి వర్గానికి, వీళ్ళు అంటే మాపిల్లలకు యాధమని గ్రహించగల

రని విశ్వసిస్తున్నాను. అయితే పిల్లకాయలవిషయంలో వీరు అనక సాధారణంగా వీళ్లు అంటాము. అందుకని ఆమాటే తీసుకొని దానికి 'వాళ్లు' అనే మాటను జోడుచేసాను. అధికారులూ బాలురూ కూడా మమ్మల్ని ఎల్లా అర్థంచేసుకొంటారో, మేము చేసిన పనులను ఎట్టి సంకుచితమైన దృష్టితో చూస్తారో, వాటికి ఎట్టి అర్థాంతరాలు కల్పిస్తారో, ఎట్టి విపరీత పరిణామంలో వారి మనస్సులకు పటుత్వాన్ని చూపెందుకై సాహసిస్తున్నానని సహృదయులమీకు విన్నవిస్తున్నాను.

వాళ్లల్లో కల్లా మా అధికారి మామేనేజరు. ఆయన ఉన్నత విద్యను గడించి పాఠశాలను స్థాపించి ఎంతో కష్టపడి నడుపుతున్నారు. పూర్వము ఏ చెట్టుక్రిందనో ఉండేది సర్వశాస్త్రాల సహితము. విద్య ఉచితమేకాక 'మావిద్యాపారస్సరా' అని అధ్యయనము ప్రారంభించేస్తిరి పోయి, విపరీతపరిస్థితులు లొచ్చినవి. ఇట్టి.........స్థితులలో ఒకపెద్ద పాఠశాలను పాలించటం కష్టతమమైన విషయము.

మా అధికారి బహునేర్పుగా వ్యవహారం నడుపుతూ సొమ్ము ఎన్నివిధాల రాబట్టాలో అన్నివిధాల రాబట్టి ఎంత తక్కువ వ్యయంచెయ్యాలో అంతే చేస్తాడు. ఉపాధ్యాయులను నియమించటం లోను, తక్కువజీతాలకు బేరం పైసలు చేయుటంలోను ఎటువంటి అసమాన ప్రజ్ఞఉందో పాఠకులకు బోధపడ్డదికదా! ఇక ఉపాధ్యాయులకు సంవత్సరం సంవత్సరం జీతాలు ఎక్కువచేయటం అనే ఆచారం అక్కడ తొలగిం

చారు. ఆయన ఇచ్చింది పుచ్చుకొని సంతోషించమని బోధిస్తారు.

సంవత్సరం పనిచేసిన తరువాత ఒకటో రెండో రూపాయలు ఎక్కువ జీతం యిస్తే వుపాధ్యాయులకు నూతనోత్సాహం కలుగుతుందనీ, చిరకాలంపాటు గొందు అభిమానం పట్టుట కలుగుతుందనీ, ఏదో ఒక సంవత్సరాలు పనిచేస్తే భవిష్యత్తు సౌఖ్యావహంగా ఉంటుందనే ఆశ ఉంటేనేకాని ఉపాధ్యాయుడు ఉత్సాహంగానూ ఉత్సాహంగానూ పనిచేయలేడు అనే విద్యావిధాన శాస్త్రజ్ఞుల మాటలలో ఆయనకు బొత్తిగా నమ్మకంలేదు.

ఆయన సిద్ధాంతాన్ని ప్రార్థ్యపక్షంచేసి జీతాలు తక్కువగా ఉండటం మూలాన మితవ్యయము అలవడుతుందనీ, జీతాలు అభివృద్ధి లేకపోవటం మూలాన సంతృప్తి ఓపిక మొదలైన సుగుణాలు పట్టుపడతవని ఆయన విశ్వసిస్తారు. జీతాలు వృద్ధి లేనప్పుడు పిల్లలు వృద్ధిఅగుట జరుగుతుందని ఆయన అనుభవంవల్ల కనిపెట్టారు. ఆదాయంలో క్షయానికీ, సంతానంలో వృద్ధికి కార్యకారణసంబంధం ఉందని ఆయన సంతానం లేని వాళ్లకు, అజీర్ణం గలవాళ్లకు, ఆకలిలేనివాళ్లకు కొంచెం జీతం తగ్గించి చూస్తారు.

కథలో నాటించి, ఎలుక ఇదే సిద్ధాంతాన్ని వ్యక్తపరుస్తున్నది. చుంచి మూషికంతో 'నువ్వు, నీజాతి నారు కలసి మాగాండ్లలోచేరి గాదెలకు బస్తాలకు బొరియలు పెట్టి ధాన్యం

అంతా తినేస్తున్నారు' అంటే మూషకరాజు తెలివైనచూపులు చూస్తూ మేము కొంచెమో గొప్పో తిన్నా, మీ యిళ్లలో ప్లేగువ్యాధిని తీసికొని వచ్చి ప్రవేశపెట్టి, మీ కుటుంబాలలో పడి తినేవాళ్లసంఖ్య తగ్గిస్తున్నాంగా, లేదా? ఉపకారమే చేస్తున్నాము. కృతజ్ఞత అయినా లేదుమీకు, అన్నడట.

ఇట్లా ఆయన పరిపాలన జరుపుతూ అప్పుడప్పుడు పాఠశాలను చూడటానికి స్వయంగా వస్తాడు. ఒకరోజున మిడిమిడి ఎండలో వచ్చాడు. ప్రొద్దుటి బడి అయిపోయింది. ఉపాధ్యాయులమంతా ఒకగదిలో కూర్చుని ఉబుసుపోక కబుర్లు చెప్పుకొంటున్నాము. వారు వచ్చారని తెలిసి వెళ్ళి కలుసుకొని, ఆయన ఎక్కడికి వెళ్లితే అక్కడకల్లా వెనకాల నడిచాము.

ఆగదీ, ఈగదీ చూచుకుంటూ ఆయన సైన్సు గదిలోకి వెళ్లాడు. ఆమూల ఈమూల తేరి పారచూశాడు. ఒకమూల పగిలిపోయిన గాజుబుడ్లు కనిపించినవి. బుడ్లు అనే ప్రయోగం నేను ఆయనవద్దనే నేర్చుకొన్నాను. ఆంగ్లంలో టెస్టుట్యూబులని ఫ్లాస్కులని అంటారే వాటినన్నిటికీ కలిపి బుడ్లు అనేమాట సామాన్యనామముక్రింద ఆయన వాడినాడు.

ఈ బుడ్లు చూచి ఆయన మొదట ముఖం చిట్లించుకొన్నాడు. ఇట్లు ఉదయించిన విసుకల్లా కోపంలోకి పరిణమించగా ఆయన, 'ఏమయ్యా! మంచీచెడ్డా తెలియనక్కరలేదా ఇన్ని బుడ్లు పగలగొట్టించావుకదా ఎవరిసొమ్ము అనుకొ

న్నావు. చిన్నతంపుచేష్టలా, లేకపోతే కొంటెతనమా?' అని నాలుగు చీవాట్లూ వేశాడు.

సైన్సు మాష్టరు, 'అయ్యా నాకు చాలా విచారం ఉంది. పిల్లలు వాటితో పనిచేసేటప్పుడు ప్రమాదవశంచేత అవి పగులుతాయని' అని వినయంతో విన్నవించాడు.

'అవునయ్యా, నీకు అంతమాత్రం తెలియదా! గాజుబుడ్లు పిల్లల చేతికిస్తారా? ఇన్నాళ్ళు చదివి ఇదేనా నీవు నేర్చుకొన్న విషయం. అసలు అటువంటి సున్నితమైన వస్తువులను పిల్లలు ముట్టుకునేటంతటి అవసరం ఏం వస్తుంది? ఏదైనా పని వుంటే నీవు వాడిచూపరాదా?' అని ఆయన కోపంగా అనంగానే పాపము సైన్సుమాష్టరుగారికి ఏమంటానికీ తోచక 'వాళ్ల చేతికి ఇయ్యక తప్పదండీ' అని యేమో చెప్పబోతుంటే అధికారి మాటకు అడ్డమువచ్చి,

'చాలు, చాల్లేవయ్యా అంత తప్పకపోతే నాకు చెప్పక పోయినావా, కానిదుంపతెగ. పోతేపోయింది. ఇత్తడివో సీనారేకువో ఇనుపవో చేయించి పడేశేవాణ్ణి. ఆ మాటమాత్రం అనకపోతివి నాతో! కొత్తవాళ్ళు మాష్టరుగాడుంటే కష్ట సుఖాలు తెలియవు.' అని ముఖం చిట్లించుకొని హెడ్‌మాష్టరు గదిలోకి పోయినాడు.

తరువాత పెద్దమాష్టరుతో కలుసుకొని ఏదో విషయమై తీవ్రంగా చర్చించాడు. చివరకు నన్ను రమ్మని కబురు పంపారు. ఏదో కొంపమునిగిందిరా, బాబు, అని మావా

ళ్ళంతా అభిప్రాయపడ్డారు కాని నేనుమాత్రం ఆయన సన్నిధికి నిర్భయంగానే వెళ్ళాను.

పెద్దమాస్టరుగారి గదిలో అధికారి, ఇద్దరు ముగ్గురు స్నేహితులు, ఒకరో ఇద్దరో ఉపాధ్యాయులు కూర్చున్నారు. హెడ్మాస్టరుగారు దుఃఖసూచక విచారాన్ని సూచించే ముఖంతో 'రావయ్యా నీమీదికి ఒక కేసువచ్చింది. ఆవిషయమై రహస్యంగా నిన్ను అడుగుతానని నేను మనవిచేస్తే, వారు ఒప్పుకోనక నిన్ను పదిమందిలోనే అడిగి చీవాట్లు వెయ్యాలని సంకల్పించుకొన్నారు. వారుఅడగటం నివృత్తికైన సమాధానం చెప్పకోలేకపోవటం ఆపైగాసలు కన్నాకాండ జరుగకుండ ఇప్పుడే వారిని శాంతించమని, ఆపైన తగిన సమాధానం చెప్పకొంటానని ప్రత్యేకంగా మనవిచేసుకో' అని పాపము ఆయననాకు శిష్యవాత్సల్యముచేత హితము బోధించినాడు.

'అయ్యా, మీరుచెప్పినహితవు నేను స్వీకరించలేనందుకు క్షమించండి. రానున్నది రాకమానదు. నేను చేసిన నేరమేమో తెలియజేయండి. తప్పుచేసివుంటే మీరిచ్చిన శిక్షను అనుభవిస్తాను' అన్నాను నేను ధైర్యంతో.

అధికారి నావంక ఉరిమిచూస్తూ 'మానాగభూషణం మీ క్లాసులోఉన్నాడు తెలుసునా? వాడికి మీరు చెప్పినవిషయం తెలియక మరొకమాటు తెలిసేటట్లు చెప్పమంటే చెప్పనని అన్నారట! అదేనా చేయవలసినది. కుర్రవాళ్లకు బోధ

పడేలాగు చెప్పనక్కరలేదా ? ఉత్తను ఉపాధ్యాయునికి ఉండ వలసిన లక్షణాలు ఇవేనా' అన్నాడు ఖాండవవనం దహింప నున్న అగ్నిహోత్రుడులాగ చూస్తూ.

నాకు అరికాలునుంచి నెత్తికి దాకా "అయ్యా, మీరు చెప్పినమాట నిజమే. నేను చెప్పనున్నమాట సత్యమే! అయితే ఎందుకంటారా అన్నానో కర్తకర్మ క్రియలలో చెప్పాలిసి వస్తే, మీరు ఇచ్చే సుప్రైవేటు పాఠాలకు నాకు ఒకమాటు కంటె ఎక్కువసార్లు చెప్పటానికి గిట్టదు. మీ యిష్టం." అని ధైర్యంగా ఒక్కగుక్కలో అనేశాను.

అక్కడనున్న పెద్దమనుష్యులు విరగబడి నవ్వారు. పెద్ద మాస్టారుగారు నవ్వును అణచివేసుకొని ముఖం చిట్లించు కొన్నారు. అధికారిమాటకు ఆ సుశాంతమైన ముఖం వేసుకొని క్రిందికి దిగి ఒకడెక్కు సుముహూర్తంలో వెళ్ళిపోయినాను.

ఆరోజు అట్లా ఆయన వెళ్ళిపోయి కమిటీ మెంబర్లలో కొందరికి నావిషయమై దురాగ్రహుడనో, అవిధేయుడనో, లేక పోతే మంచి మాస్టరు కాననో చెప్పి ఉంటాడు. అధికారుల నిరంకుశ ప్రభుత్వానికి తలలొగ్గవలసిందే గాని నోరెత్తి చెప్పు కొంటానికి మాస్టర్లకు అవకాశం లేదుగదా! ఏం చెప్పాడో మరి. కమిటీ మెంబర్లలో ఒకాయన, వైశ్యకుల శిరోమణి ఒకనాడు స్కూలుకు వచ్చి 'ఎవరండీ ఆయన' అని అడిగాడు. పైన చెప్పిన విషయాన్ని పురస్కరంగా తీసికొని హెడ్మాస్టరు గారు నేను నాలుగో ఫారంలో ఉన్నానని చెప్పి దారిచూపి

"ఏదో పరాభవం అవుతుందేమో" అని మనస్సులో అనుకొన్నాడట.

నేను గ్లోబును బల్లమీద పెట్టుకొని జాగ్రఫీ బోధిస్తున్నాను. క్లాసుకి పైట రెండునిమిషాలు ఉంచుని పని లోపలికి రాగా, పోనీలే అని నేనూ నమస్కారం చేసి మాట్లాడించాను. ఆయన ధుమధుమలు మిటమిటలు ఆయన నాలో ఏదో తప్పు పట్టుకోవాలెనని భగీరథప్రయత్నాలు చేస్తున్నట్లు స్పష్టంగా చెప్పినవి. అటుచూచి ఇటుచూచి ఏమీ తోచక ఏదో అప్రయత్నంగా ఆగ్లోబుమీద చెయ్యివేసేసరికి అది గిర్రున తిరిగింది. వెంటనే ఆయన నిప్పులు గ్రక్కుతూ, 'ఆహా! అయింది, దీపమేకులు ఊడగొట్టి ఇది పాడుచేశావే' అన్నాడు. గ్లోబు గుండ్రంగా తిరగటం మూలాన అది పాడు అయిపోయింది, మేకు లూడిపోయి అనుకొన్నాడు పాపం మానవుడు. నేను కాస్త హాస్యరసపిపాసాబాధితుడ్ని కాబట్టి, విచారం అభినయించి, 'అయ్యా, మీరు క్షమించాలి. ఏదో పొరపాటు జరిగింది. హెడ్‌మాస్టరుగారు మొన్న సెక్రటరీగారు వచ్చి పోయిన దగ్గరనుంచీ అసలే కోపంగా ఉన్నారు. మీరు ఈ విషయం ఆయనతో చెబితే నాకు తీరని కష్టం వస్తుంది' అని చేతులు నలుపుకొంటూ దీనంగా అన్నాను.

ఆ కమిటీ మెంబరుగారు సన్న నా భద్దాముస్న ఆగ్రహంతో ఉన్నారు కాని ఏమాత్రం కరుణచూపక ఆగ్లోబును పట్టుకొని సరాసరిని పెద్దమాస్టరు గదిలోకి చిందులు త్రొక్కుకుంటూ

నాశనము లేనట్టియు అక్షయమైనట్టియు ఆ మంత్రమును ఉపాసన చేయగా మాపైన దానికి కరుణ లేదు. మా గడియారాలను తలుస్తున్న ఊళ్ళోఉన్న ఇతర గడియారాలను తిరస్కార భావంతో తృణీకరించి స్వేచ్ఛాగతిని ప్రవహిస్తూ ఉండటమే కాకుండా ఉత్తమభక్తుడనో నెత్తిమీదతన్నే పూజారినో మా హెడ్ మాష్టరుగారి ఇష్టాన్ని అనుసరించి ఆయన ఆలస్యంగా వచ్చినరోజున వెనక్కి రెండు అంగుళాలు వేసి, పెందలకడే వచ్చినరోజున రెండు అంగుళాలు ముందుకేసి అనుకూలవతియైన భార్యలాగా ఆ మన ఇచ్ఛానువర్తియై యుంటుంది.

సెక్రటరీ కమిటీ మెంబర్లు బ్యాంకుగడియారము కాక మాస్కూలు ప్యూన్ కూడా మా అధికారవర్గములో చేరినవాడే! అతని నల్లగిన్నెం ఈ ఊరింటిలో తెల్లవారుస్తుంది. కాబట్టి అతనికి స్థానబలిమి ఏర్పడి స్వాతంత్ర్యం కుదిరిందమేకాక ఉపాధ్యాయులపైన నేరాలు చెప్పటానికికూడా ధైర్యం సంపాదించాడు. అతనేకాక పెద్దమాష్టరుగారి బావమరది, కమిటీమెంబర్ల అన్నయ్యల బావమరదుల కొడుకులు మాకు అధికారులే. ఇంక వీరిలో ఎవరు తల్చుకొన్నా చాలు మాకొంప మునగటానికి.

ఇట్లా ఈపాఠశాల అనే సంస్థకు చెందిన ప్రతిమనిషీ నిరంకుశపరిపాలనకు సాధన మవుతున్నాడు. నిరంకుశ పరిపాలన పూర్వపు పద్ధతి కాబట్టి మాపరిపాలకవర్గము సనాతనధర్మావలంబకులు అని చెప్పటమే నా అభిప్రాయంకాని మరొకటి కాదు. వారేకాదు. ఉపాధ్యాయులుకూడా మార్పుఅంటే

ఇష్టం లేక సనాతనధర్మావలంబకులే. వారు ఉండేది పాతపూరి కొంపలు చెప్పేవి తాతలనాటి పాతకథలు. ధరించేవి పాతవస్త్రాలు

పాతకాలంలో వున్న ప్రతిదన్నా కూడా ఈవిధంగా పాత విషయాలంటే అభిమానం కనపరుస్తు ఉన్నటువంటి సమయంలో ఒక్క గోడలుమాత్రం దానికి భిన్నంగా ప్రవర్తిస్తవి. ఇక్కడమటుకు ప్రాతవిషయాలకు చోటు ఏమాత్రంలేదు. ఏరోజు కారోజు క్రొత్తవిషయాలు గోడలమీద కెక్కుతవి. మాష్టర్లకు పెట్టేపేర్లు, తిట్లు, కొందరివిషయాన్ని వారికి కలిగిన అభిప్రాయాలు, ఇత్యాది సమస్తవిషయాలు ఏరోజు కారోజు గోడలమీద అచ్చుపడుతుంటవి.

# 7

## ఇరుగూ — పొరుగూ

ఉపాధ్యాయవృత్తి అన్నివృత్తులలోను ఉత్తమమైనది. దానాల అన్నిటిలోను అత్యుత్కృష్టమైన విద్యాదానం చేస్తూ ఒకరి కొంప తీయటానికి కాని దొంగసాక్ష్యాలు సృష్టించి తెలివి అనే పదార్థంతో గారడీలుచేసి ఒకరికి అపకారం చేయటానికి గాని అవకాశం లేశమైన లేనిదీవృత్తి. అంతేకాకుండా అన్ని వృత్తులు ఉపాధ్యాయత్వానికి సాగిలపడి సాష్టాంగ నమస్కారం చేయాలిసిందే. ఎందుచేతనంటారా! ఉపాధ్యాయత్వంలేనిది

వృత్తికి పుట్టుక లేదు. మిషన్ తొట్టిలో కూర్చుండి సూదులను అందించే కుర్రవాడికి గడ్డం సాహెబు గులాం రాలీఖాన్ గురువు. విత్తనాల్ని పసుమునూనెతో పిల్లవాడికి స్వతంగా విద్యా ఉపాధ్యాయుడు. ఆసుపత్రిలో మందులను రంగురంగు సీసాలలో పోసే ఆ కుర్రకు డాక్టరు ఇచ్చిన చీటీ గురువు. కాబట్టి సూక్ష్మంగా చూస్తే ప్రతివానికి ఒక గురుస్థానం కనబడి ఆదర్శప్రాయమై, అనుకరణయోగ్యమై, పూజనీయమౌతుంది. మానవజాతికి ధర్మసూత్రాలు బోధించిన శాస్త్రకారులు గురువులు. వేదములు అపౌరుషేయములే అయితే వేదకర్తలు జగత్ గురువులు.

ఇట్లు వృత్తులకెల్ల మూలాధారమై ఇందుగలదందు లేదను సందేహము వలదు అని చెప్పదగిన ఉపాధ్యాయవృత్తికి లోకం గోడలు కట్టి బడిసంతులలో ఇమిడ్చి వేయుట మూలాన నా వృత్తికి వైశాల్యం కల్పించటానికి ప్రయత్నాలు సూచి సంకుచితమై, సాధారణమై, స్థిరమైన అర్థానికి కట్టుబడ్డ ఉపాధ్యాయునికి లోకంలో ఎట్టి విపరీతములు ఆరాధనాలు, అగౌరవాలు, భక్తిపురస్సరాభినందనాలు కలుగుతున్నవో, వాటిని గురించి నాకు తోచిన అర్థాలు నాకు కలిగిన ఆనందంతో సహా చూపి నా యందు సానుభూతినే మూర్తిభవించేసుకొన్న మీవంటి సహృదయులకు తెలియజేసుకొనే తృప్తికోసం మీ అధికారాన్ని వేడుకొంటున్నాను.

అయితే చదువరులైన విమర్శకశిఖామణులారా! నిశితమైన

